# ఓం మహాగణాధిపతయే నమః

## ఓం మహాసరస్వత్యై నమః

# వినాయక చవితి వ్రతకల్పము



శ్రీరస్తు　　　　శుభమస్తు　　　　అవిఘ్నమస్తు

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోప శాంతయే ॥

సుముఖశ్చైకదంతశ్చ కపిలో గజకర్ణకః । లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః । ధూమకేతుర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః । వక్రతుండ శ్శూర్పకర్ణః హేరంబ స్కందపూర్వజః । షోడశైతాని నామానియః పఠేచ్ఛృణు యాద పి ॥ విద్యారంభే వివాహేచ ప్రవేశే నిర్గమే తథా। సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య నజాయతే । అభీష్టితార్థ సిధ్యర్థం పూజితో యస్సురైరపి । సర్వవిఘ్నచ్ఛిదే తస్మై । శ్రీ గణాధిపతియే నమః ॥

శుభతిధౌ శోభనముహూర్తే ఆద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేత వరాహకల్పే వైవస్వతమన్వంతరే కలియుగే ప్రధమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరోః దక్షిణదిగ్భాగే శ్రీ శైలస్య ఈశాన్య ప్రదేశే, కృష్ణాగోదావర్యోః మధ్యదేశే గృహే అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన – సంవత్సరే దక్షిణాయనే వర్షర్తౌ భాద్రపదమాసే శుక్ల పక్షే చతుర్థ్యాం వాసరే శుభనక్షత్ర శుభయోగ శుభకరణ ఏవంగుణ విశేషణ విశిష్టాయాం అస్యాం శుభతిధౌ శ్రీమాన్ గోత్రః నామధేయః – శ్రీమతః గోత్రస్య నామధేయస్య ధర్మపత్నీ సమేతస్య మమోపాత్త దురితక్షయద్వారా – అస్మాకం సహకుటుంబానాం క్షేమస్థయిర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభివృధ్యర్థం ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థం సకల విద్యాప్రాప్త్యర్థం – పుత్ర పౌత్రాభివృద్ధ్యర్థం, ఇష్టకామ్యార్థ సిద్ధ్యర్థం, మనో వాంఛాఫలసిద్ధ్యర్థం సమస్త దురితోపశాంత్యర్థం – సమస్త మంగళా వాప్త్యర్థం – వర్షేవర్షే ప్రయుక్త వరసిద్ధి వినాయక దేవతాముద్దిస్య వరసిద్ధి – వినాయక దేవతా ప్రీత్యర్థం కల్పోక్త ప్రకారేణ యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే ॥ తదంగ కలశ పూజాం కరిష్యే ॥ కలశం గంధపుష్పాక్షతైరభ్యర్చ్య । తస్యోపరి హస్తంనాధాయ – కలశస్యముఖే విష్ణుః కంఠే రుద్రస్సమాశ్రితః । మూలే తత్రస్థితో బ్రహ్మ మధ్యే మాతృ గణాస్థితాః కుక్షౌతు సాగరా స్సర్వే సప్త ద్వీపా వసుంధరా। ఋగ్వేదోథ యుజుర్వేద స్సామవేదో హ్యధర్వణః అంగశ్చై సహితా స్సర్వేకలశాంబు నమాశ్రితాః ॥ ఆయాంతు దేవపూజార్థం దురితక్షయ కారకాః। గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతీ। నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు॥ కలశోదకేన దేవ మాత్మానం పూజా ద్రవ్యాణి సంప్రోక్ష్య ॥

అథౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం గణపతి పూజా కరిష్యే॥ మహాగణాధిపతయే నమః ధ్యాయామి., ధ్యానం సమర్పయామి, ఆవాహయామి, ఆసనం సమర్పయామి, హస్తయోః అర్ఘ్యం సమర్పయామి, పాదయోః పాద్యం సమర్పయామి, ఔపచారిక స్నానం సమర్పయామి.స్నానానంతరం ఆచమనం సమర్పయామి, వస్త్రం సమర్పయామి, గంధాన్ ధారయామి, గంధస్యోపరి అలంకరణార్థం అక్షతాన్ సమర్పయామి, పుష్పైః పూజయామి। ఓం సుముఖాయనమః , ఓం ఏకదంతాయ నమః, ఓం కపిలాయనమః, ఓం గజకర్ణాయనమః, ఓం లంబోదరాయ నమః, ఓం వికటాయనమః, ఓం విఘ్నరాజాయనమః, ఓం గణాధిపాయనమః, ఓం ధూమకేతువే నమః, ఓం గణాధ్యక్షాయ నమః, ఓం ఫాలచంద్రాయ నమః, ఓం గజాననాయనమః, ఓం వక్రతుండాయనమః, ఓం శూర్పకర్ణాయనమః, ఓం హేరంబాయనమః, ఓం స్కందపూర్వజాయనమః, ఓం మహాగణాధిపతయే నమః, నానావిధ పరిమళ పత్ర పుష్పాణి సమర్పయామి, ధూపార్థం అక్షతాన్ సమర్పయామి, దీపార్థం అక్షతాన్ సమర్పయామి, నైవేద్యం సమర్పయామి, ఓం భూర్భువస్సువః. ప్రచోదయాత్ దేవసవితుః ప్రసువ సత్యంత్వర్తేన పరిషించామి, అమృతమస్తు, అమృతోపస్తరణమసి, ఓం ప్రాణాయ స్వాహా బ్రహ్మణేస్వాహా, మహా గణాధిపతయే నమః యథాభాగం గుడం నివేదయామి, మధ్యే మధ్యే పానీయం సమర్పయామి, తాంబూలం సమర్పయామి, ఆచమనం సమర్పయామి, ఆనంద కర్పూరనీరాజనం సమర్పయామి. వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ, అవిఘ్నం కురుమేదేవం సర్వకార్యేషు సర్వదా, మహాగణాధిపతయేనమః, ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి, గణాధిపతిః, సుప్రీత స్సుప్రసన్నో వరదోభవతు, మమ ఇష్ట కామార్ధ ఫలసిధ్యర్థం గణాధిపతి ప్రసాదం శిరసా గృహ్ణామి ॥

భవనంచిత పాపౌఘ విధ్వంసన విచక్షణం. విఘ్నాంధకార భాస్వంతం విఘ్నరాజమహం భజే॥ ఏకదంతం శూర్పకర్ణం గజవక్త్రం చతుర్భుజం పాశాంకుశధరం దేవం ధ్యాయేత్సిద్ధి వినాయకం॥ ఉత్తమం గణనాథస్య వ్రతం సంపత్కరం శుభం. భక్తాభీష్ట ప్రదం తస్మాత్ ధ్యాయేత్తం విఘ్ననాయకం ॥ ధ్యాయేద్గజాననం దేవంతప్త కాంచన సన్నిభం చతుర్భుజం మహాకాయం సర్వాభరణ భూషితం ॥ శ్రీ గణాధిపతయేనమః ధ్యాయామి ॥ అత్రాగచ్ఛ జగద్వంద్య సురరాజార్చితేశ్వర అనాథనాథ సర్వజ్ఞ గౌరీ గర్భ సముద్భవ ॥ ఆవాహయామి ॥ మౌక్తికైః పుష్యరాగైశ్చ నానారత్న విరాజితం, రత్న సింహాసనం చారు ప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం ॥ ఆసనం సమర్పయామి ॥ గౌరీపుత్ర నమస్తేస్తు శంకర ప్రియనందన। గృహాణార్ఘ్యం మయాదత్తం

గంధపుష్పాక్షతైర్యుతం ॥ అర్ఘ్యం సమర్పయామి ॥ గజవక్త్రం - నమస్తేస్తు సర్వాభీష్ట ప్రదాయకా భక్త్యాపాద్యం మయాదత్తం గృహాణ ద్విరదాసన పాద్యం సమర్పయామి ॥ అనాధనాథ సర్వజ్ఞ గీర్వాణ గణపూజిత । గృహాణాచమ నందేవ తుభ్యందత్తం మయా ప్రభో ॥ ఆచమనం సమర్పయామి ॥ దధి క్షీర సమాయుక్తం మధ్యాజ్యేన సమన్వితం ॥ మధుపర్కం గృహేణేధం గజవక్త్ర ... నమోస్తుతే ॥ మధుపర్కం సమర్పయామి ॥ స్నానం పంచామృతైర్దేవ గృహాణ గణనాయక । అనాథనాథ సర్వజ్ఞ గీర్వాణ గణపూజిత - పంచామృత స్నానం సమర్పయామి ॥ గంగాది సర్వతీర్థేభ్యః అహృతైరయామి మలైర్జలైః స్నానం కరిష్యే భగవన్నుమా పుత్ర నమోస్తుతే శుద్ధోదక స్నానం సమర్పయామి ॥ రక్త వస్త్ర ద్వయంచారు దేవయోగ్యంచమంగళం । శుభప్రదం గృహాణత్వం లంబోదర హరాత్మజా - వస్త్రయుగ్మం సమర్పయామి ॥ రాజితం బ్రహ్మసూత్రంచ కాంచనం చోత్తరీయకం । గృహాణ సర్వ ధర్మజ్ఞ భక్తానామిష్టదాయకా ఉపవీతం సమర్పయామి ॥ చందనాగరు కర్పూర కస్తూరీ కుంకుమాన్వితం విలేపనం సురశ్రేష్ఠప్రీత్యర్థం ప్రతి గృహ్యతాం - గంధం సమర్పయామి ॥ అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ శాలీయాన్ తండులాన్ శుభాన్ । గృహాణ పరమానంద ఈశపుత్ర నమోస్తుతే ... అక్షతాన్ సమర్పయామి ॥ సుగంధాని సుపుష్పాణి జాజీ కుందముఖానిచ । ఏకవింశతి పత్రాణి సంగృహాణ నమోస్తుతే ॥

పుష్పాణి పూజయామి । అధాంగపూజా - గణేశాయనమః పాదౌ పూజయామి, ఏకదంతాయనమః గుల్ఫం, శూర్పకర్ణాయనమః జానునీ, విఘ్నరాజాయనమః జంఘే, అఖువాహనాయనమః రూరుం, హేరంబాయ నమః, కటిం లంబోదరాయ నమః, ఉదరం గణనాధాయనమః, నాభిం, గణేశాయనమః హృదయం, స్థూలకంఠాయనమః కంఠం స్కంధాగ్రజాయనమః స్కంధౌ పాశహస్తాయనమః హస్తౌ, గజవక్త్రాయనమః వక్త్రం, విఘ్నహంత్రేనమః, శూర్పకర్ణాయనమః, కర్ణౌ, ఫాలచంద్రాయ నమః, లలాటం, సర్వేశ్వరాయనమః శిరః పూజయామి ॥ విఘ్నరాజాయనమః మాచీపత్రం పూజయామి, గణాధిపాయనమః బృహతీపత్రం, ఉమాపుత్రాయనమః బిల్వపత్రం, గజాననాయనమః, దుర్వారయుగ్మం, హరసూనవేనమః దత్తూరపత్రం, లంబోదరాయనమః బదరీ పత్రం, గుహాగ్రజాయనమః అపామార్గపత్రం, గజకర్ణాయనమః తులసీపత్రం భిన్నదంతాయనమః విష్ణుక్రాంతపత్రం, వటవే నమః దాడి పత్రం, సర్వేశ్వరాయనమః దేవదారుపత్రం, ఫాలచంద్రాయనమః మరువక పత్రం, సురాగ్రజాయనమః సింధూ వారపత్రం, శూర్పకర్ణాయనమః జాజీపత్రం, సురపూజితాయనమః గండకీపత్రం ఇభవక్త్రాయనమః, శమీపత్రం, వినాయకాయనమః అశ్వత్థపత్రం, సురసేవితాయనమః అర్జునపత్రం, కపిలాయనమః అర్కపత్రం, కుమారగురవేనమః, చూతపత్రం, సర్వసిద్ధిప్రదాయనమః కపిత్థపత్రం పూజయామి, శ్రీ గణేశ్వరాయనమః ఏకవింశతి పత్రాణి పూజయామి. నానావిధ పరిమళపత్ర పుష్పాక్షతైః పూజాం సమర్పయామి, దశాంగం గుగ్గులోపేతం సుగంధం సుమనోహరం ఉమాసుత నమస్తుభ్యం గృహాణ వరదోభవ - ధూపమాఘ్రాపయామి సాజ్యం త్రివర్తి సంయుక్తం వహ్నినా యోజితం మయా । గృహాణమంగళం దీపం ఈశపుత్ర

నమోస్తుతే - దీపం దర్శయామి, సుగంధం స్సుకృతాం శైవమోదతాన్, ఘృతపాచితాన్ నైవేద్యం. గృహ్యతాం దేవచరణముద్గైః ప్రకల్పితాన్ ॥ భక్ష్యం భోజ్యంచ లేహ్యంచ చోష్యం పానీయం మేవచ। ఇదం గృహాణ నైవేద్యం మయాదత్తం వినాయక నైవేద్యం సమర్పయామి॥ పూగీఫలసమాయుక్తం నాగవల్లీ దళైర్యుతం ॥ కర్పూర, చూర్ణ సంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం - తాంబూలం సమర్పయామి ॥ సచ్చిదానంద విఘ్నేశపుష్కలాని ధనానిచ॥ భూమ్యాంస్థితాని భగవాన్ స్వీకురుష్వ వినాయక - సువర్ణపుష్పం సమర్పయామి ॥ ఘృతవర్తి సహస్రైశ్చ కర్పూర శకలైస్తథా। నీరాజనం మయాదత్తం గృహాణవరదోభవ - నీరాజనం సమర్పయామి ॥ అథ దూర్వాయుగ్మపూజ ॥ గణాధిపాయనమః దూర్వాయుగ్మం పూజయామి - ఉమాపుత్రాయనమః - దూర్వాయుగ్మం - అఖువాహనాయనమః దూర్వా - వినాయకాయ - దూర్వా - ఈశపుత్రాయ - దూర్వా సర్వ సిద్ధి ప్రదాయకాయ దూర్వా ఏకదంతాయ - దూర్వా - ఇభవక్త్రాయ - దూర్వా - మూషిక వాహనాయ, దూర్వా - కుమారగురవేనమః - దూర్వా యుగ్మం పూజయామి ॥ గణాధిప నమస్తేస్తు ఉమాపుత్రా విఘ్ననాశన। వినాయకేశ తనయ సర్వసిద్ధి ప్రదాయక ॥ ఏక దంతైక వదన తథా మూషిక వాహన। కుమార గురవేతుభ్యం అర్పయామి సుమాంజలిం॥ మంత్రపుష్పం సమర్పయామి ॥ ప్రదక్షిణం కరిష్యామి సతతం మోదకప్రియ। నమస్తే విఘ్నరాజాయనమస్తే విఘ్ననాశన - ప్రదక్షిణ నమస్కారం సమర్పయామి ॥ అర్ఘ్యం గృహాణ హేరంబ సర్వభద్ర ప్రదాయక ॥ గంధ పుష్పాక్షతైర్యుక్తం పాత్రస్థం పాపనాశనం ॥ పునరర్ఘ్యం సమర్పయామి ॥ యంబ్రహ్మ వేదాంతవిదోవదంతి వరంప్రధానం పురుషం తథాన్యే। విశ్వోద్గతే కారణ మీశ్వరంతం తస్మై నమో విఘ్నవినాయకాయ ॥ గణేశాయ నమస్తుభ్యం నమస్తే విఘ్ననాశకః। ఈప్సితం మే ఫలం దేహి పరత్రచ పరాంగతిం ॥ వినాయక నమస్తుభ్యం సతతం మోదక ప్రియా నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా ॥

# విఘ్నేశ్వర అష్టోత్తర శతనామ పూజ

## ప్రతినామానికి ముందు ఓం, చివర నమః చేర్చి చదువుకోవాలి

ఓం గజాననాయ నమః
గణాధ్యక్షాయ
విఘ్నరాజాయ
శివప్రియాయ
శ్రీఘ్రకారిణే
శాశ్వతాయ
విష్ణు ప్రియాయ
భక్త జీవితాయ
జితమన్మధాయ
వినాయకాయ
ద్వైమాతురాయ
ద్విముఖాయ
ప్రముఖాయ
సుముఖాయ
కృతినే
సుప్రదీపాయ
సుఖనిధయే
సురాధ్యక్షాయ
సురారిఘ్నాయ
మహాగణపతయే
మాన్యాయ
మహాకాలాయ
మహాబలాయ
హేరంబాయ
లంబకర్ణాయ
హ్రస్వగ్రీవాయ
మహోదరాయ
మహోత్కటాయ
మహావీరాయ
మంత్రిణే
మంగళాస్వరూపాయ
ప్రమాదాయ
ప్రథమాయ
ప్రజ్ఞాయ
విఘ్నకర్త్రే
విఘ్నహంత్రే
విశ్వనేత్రే

ఓం గజాననాయ నమః
విరాటత్పయే
శ్రీ పతయే
వాక్పతయే
శృంగారిణే
ఆశ్రితవత్సలాయ
బలాయ
బలోత్థితాయ
భవాత్మజాయ
పురాణపురుషాయ
పూష్ణే
పుష్కరక్షిప్తవారిణే
అగ్రగణ్యాయ
అగ్రపూజ్యాయ
అగ్రగామినే
మంత్రకృతే
చామేకరప్రభాయ
సర్వాయ
సర్వోపనన్యాసాయ
సర్వకర్త్రే
సర్వనేత్రే
సర్వసిద్ధి ప్రదాయ
సర్వసిద్ధయే
పంచహస్తాయ
పార్వతీనందనాయ
ప్రభవే
కుమారగురవే
అక్షోభ్యాయ
కుంజరాసుర
భంజనాయ
ప్రమోదాయ
మోదకప్రియాయ
కాంతిమతే
ధృతిమతే
కామినే
కపిత్థపనసప్రియాయ
బ్రహ్మచారిణే

ఓం గజాననాయ నమః
బ్రహ్మరూపిణే
బ్రహ్మవిద్యాధిపాయ
విష్ణవే
ఐశ్వర్య కారణాయ
జ్యాయసే
యక్షోకిన్నరసేవితాయ
గంగాసుతాయ
గణాధీశాయ
గంభీరనినదాయ
వటవే
అభీష్టవరదాయినే
జ్యోతిషే
భక్తనిధయే
భావగమ్యాయ
మంగళ ప్రదాయ
అవ్యక్తాయ
అపాకృతపరాక్రమాయ
సత్యధర్మిణే
సఖ్యే
సరసాంబునిధయే
మహేశాయ
దివ్యాంగాయ
మణికింకిణీ మేఖలాయ
సమస్తదేవతామూర్తయే
సహిష్ణవే
సతతోత్థితాయ
విఘాతకారిణే
విశ్వక్దృశే
విశ్వరక్షాకృతే
కళ్యాణగురవే
ఉన్మత్తవేషాయ
అపరాజితే
సమస్తజగదాధారాయ
సర్వైశ్వర్యప్రదాయ
ఆక్రాన్తచిదచిత్ప్రభవే
శ్రీ విఘ్నేశ్వరాయనమః

# విఘ్నేశ్వర ప్రార్థనలు

॥ఉ. తుండము నేకదంతమును దోరపు బొజ్జయు, వామహస్తమున్
మెండుగ మ్రోయుగజ్జెలును మెల్లని చూపులు మందహాసమున్
కొండొక గుజ్జురూపమున కోరిన విద్యలకెల్ల నొజ్జయై
యుండెడి పార్వతీతనయ యోయి గణాధిప నీకు మ్రొక్కెదన్

చ. తొలుత నవిఘ్నమస్తనుచు దూర్జటి నందన నీకు మ్రొక్కెదన్
ఫలితము సేయవయ్య నిను ప్రార్థన జేసెద నేకదంత నా
వలపలిచేత ఘంటమున వాక్కున నెప్పుడు బాయకుండుమీ
తలపున నిన్ను వేడెదను దైవగణాధిప । లోకనాయకా

క. తలచితినే గణనాధుని తలచితి నే విఘ్నపతిని దలచిన పనిగా
తలచితి నే హేరంబు ని దలచితి నా విఘ్నములను తొలగించుటకున్

క. అటుకులు కొబ్బరిపలుకులు చిటిబెల్లము నానుబ్రాలు చెఱకురసంబున్
నిటలాక్షు నగ్రసుతునకు బటుతరముగ విందుసేతు బ్రార్థింతు మదిన్

# విఘ్నేశ్వరుని దండకము

శ్రీ పార్వతీపుత్రలోక త్రయస్తోత్ర చారిత్ర భద్రేభవక్త్రా మహాకాయ కాత్యాయనీనాథ సంజాత స్వామీ శివా సిద్ధి విఘ్నేశ నీ పాద పద్మంబులన్ నీదు కంఠంబు నీ బొజ్జనీ మోము నీ మౌళి బాలేందు ఖండంబులు నాల్గు హస్తంబులున్నీ కరాళంబు నీ పెద్ద వక్త్రంబు దంతంబు నీ పాద హస్తంబు లంబోదరంబున్ సదా మూషికాశ్వంబు నీ మందహాసంబు నీచిన్ని తొండంబు నీ గుజ్జురూపంబు నీ శూర్పకర్ణంబు నీ యజ్ఞోపవీతంబు నీ దివ్యరూపంబు దర్శించి హర్షించి సంప్రీతి మ్రొక్కంగ శ్రీ గంధమున్ కుంకుమాక్షతలాజలున్ పంకజంబుల్ తగన్ మల్లెలు న్మొల్లలు న్మంచి చేమంతులున్ దెల్లగన్నేరులున్ మంకెనల్ పొన్నలున్ పువ్వులున్మంచి దూర్వంబులు న్దెచ్చి శాస్త్రోక్తరీతిన్ సమర్పించి పూజించి సాష్టాంగముంజేసి విఘ్నేశ్వరా నీకు టెంకాయ పొన్నంటి పండ్లున్ మరిన్మంచివౌ నిక్షుఖండంబులు న్రేగుబండ్లప్పడంబుల్ వడల్ నేతిబూరెల్ మదిన్ గోధుమప్పంబులున్ పునుగులు న్బూరెలున్ చొక్కమౌ చల్మిడిన్ బెల్లమున్ తేనెయుంజున్ను బాలాజ్యమున్నాను బియ్యంబు నామ్రంబు బిల్వంబు మేల్బంగారు బళ్ళెమందుంచి నైవేద్యముం బంచనీరాజనంబున్ నమస్కారముల్ జేసి విఘ్నేశ్వరా నిన్ను బూజింపకేయన్యదైవంబులన్ బ్రార్థనల్ సేయుటల్ కాంచనంబొల్లకే ఇన్ముదాగోరు

చందంబుగాదే మహాదేవా యోభక్తమందార యోసుందరాకార యోభాగ్యగంభీర యోదేవచూడామణీ లోక రక్షామణీ బంధు చింతామణీ స్వామి నిన్నెంచ నేనంత నీదాస

దాసాను దాసుండ శ్రీ దాంత రాజాస్వరాయుండ రామాభిదాసుండ నన్నెప్పు వేఱల్కి సుశ్రేయనింజేసి శ్రీ మంతుగాచూసి హృత్పద్మ సింహాసనారూఢతన్నిల్పి కాపాడుటేకాదు ఏర్పోర్ల ప్రార్థించు భక్తాళికిన్ కొంగుబంగారమై కంటికిన్ రెప్పవై బుద్ధియు న్విద్యయు న్వాడియున్ పంటియున్ పుత్రపౌత్రాభివృద్ధిన్ దగన్ కల్గగాజేసి పోషింపుమంటిన్ గృపన్ గావుమంటిన్ మహాత్మా యివే వందనంబుల్ శ్రీ గణేశా నమస్తే నమః ।

# విఘ్నేశ్వరుని మంగళ హారతులు

శ్రీ శంభుతనయునకు - సిద్ధిగణనాథునకు వాసిగల దేవతావంద్యునకును అపర విద్యలకు ఆది గురువైనట్టి భూసురోత్తమ లోక పూజ్యునకు జయమంగళం ॥ నేరేడు మారేడు నెలవంక మామిడి దూర్వార చెంగల్వ ఉత్తరేణు । వేరు వేరుగదెచ్చి వేడ్కతో పూజింతు పర్వమున దేవగణపతికి నిపుడు ॥జయ॥ సురుచిరముగ భాద్రపద శుద్ధ చవితియందు పొసగ సజ్జనులచే పూజగొల్తు ॥జయ॥ శశి చూడరాకున్న జేకొంటినొక వ్రతము పర్వమున దేవగణపతికి నిపుడు ॥జయ॥ పానకము వడపప్పు పనస మామిడి పండ్లు దానిమ్మ ఖర్జూర ద్రాక్షపండ్లు । తేనెతో మాగిన ,తియ్యమామిడి పండ్లు మాకు బుద్ధినిచ్చు గణపతికి నిపుడు ॥జయ॥ ఓ బొజ్జ గణపయ్య నీబంటు నేనయ్య ఉండ్రాళ్ళ మీదికి దండుపంపు । కమ్మని నెయ్యియు కడుముద్దపప్పయు బొజ్జ విరుగగ దినుచు పొరలుకొనుచు ॥జయ॥ వెండి పళ్ళెరములో వేయివేల ముత్యాలు కొండలుగ నీలములు కలిపంబోసి । మెండుగను హారములు మెడనిండ వేసికొని దండిగా నీకిత్తు ధవళహారతి ॥జయ॥ పువ్వులను నినుగొల్తు పుష్పాల నినుగొల్తు గంధాల నిన్నుగొల్తు కస్తూరిని । ఎప్పుడూ నినుగొల్తు ఏకచిత్తంబున పర్వమున దేవగణపతికి నిపుడు ॥జయ॥ ఏకదంతంబును ఎల్ల గజవదనంబు బాగయిన తొండంబు నలపుకడుపు । జోకయిన మూషికము సొరిది నెక్కాడుచును భవ్యుడగు దేవగణపతికి నిపుడు ॥జయ॥ మంగళము మంగళము మార్తాండ తేజునకు మంగళము దేవగణపతికి నిపుడు ॥జయ॥ బంగారు చెంబుతో గంగోదకము తెచ్చి సంగతిగ శివునకు జలకమార్చి ॥ మల్లెపువ్వులు దెచ్చి మురహరుని పూజింతు రంగైన నా ప్రాణలింగమునకు ॥జయ॥ పట్టుచీరలు మంచి పాడిపంటలు గల్గి గట్టిగా కనకములు కరులు హరులు ॥జయ॥ యిష్టసంపదలిచ్చి యేలిన స్వామికి పట్టభద్రుని దేవగణపతికి నిపుడు ॥జయ॥ ముక్కంటి తనయుడని ముదముతో వేమను చక్కనైన వస్తు సమితి గూర్చి ॥జయ॥ నిక్కముగ మనమును నీయందె నేనిల్పి ఎక్కుడగు పూజలాలింపజేతు ॥జయ॥ మల్లెలా మొల్లలా మంచి సంపెంగెలా చల్లనైన గంధ సారములను । ఉల్లమలరగ మంచి ఉత్తమపు పూజలు కొల్లలుగనేజేతు కోరి విఘ్నేశ ॥జయ॥ దేవాది దేవునకు దేవతాద్యునకు, దేవేంద్రవంద్యునకు దేవునకును ॥ దేవతలు మిముగొల్చి తెలిసి పూజింతురు భవ్యుడగు దేవగణపతికి నిపుడు ॥జయ॥ చెంగల్వ చేమంతి చెలరేగి గన్నేరు తామరలు తంగేడు తరచుగాను। పుష్పజాతులు తెచ్చి పూజింతు నేనెపుడు బహుబుద్ధి గణపతికి బాగుగాను ॥జయ॥ మారేడు మామిడి మాదీఫలంబులు ఖర్జూర పనసలును కదళికములు । నేరేడు నెలవంది టెంకాయ తేనెయు చాలగా నిచ్చెదరు చనువుతోను ॥జయ॥ ఓ బొజ్జగణపతి ఓర్పుతో రక్షించి కాచి మమ్మేలుమీ కరుణతోను । మాపాలగలవని మహిమీద నెల్లప్పుడు కొనియాడుచుందము కోర్కె లీడేర ॥జయ॥

దాసాను దాసుండ శ్రీ దాంత రాజాస్వరాయుండ రామాభిదాసుండ సన్నొప్ప వేఱట్టి సుశ్రేయనింజేసి శ్రీ మంతుగాచూసి హృత్పద్మ సింహాసనారూఢతన్నిల్పి కాపాడుటేకాదు పన్నొల్పి ప్రార్థించు భక్తాళికిన్ కొంగుబంగారమై కంటికిన్ రెప్పవై బుద్ధియు న్విద్యయు న్నాడియున్ పంటియున్ పుత్రపౌత్రాభివృద్ధిన్ దగన్ కల్గగాజేసి పోషింపుమంటిన్ గృపన్ గావుమంటిన్ మహాత్మా యివే వందనంబుల్ శ్రీ గణేశా నమస్తే నమః ।

# విఘ్నేశ్వరుని మంగళ హారతులు

శ్రీ శంభుతనయునకు – సిద్ధిగణనాథునకు వాసిగల దేవతావంద్యునకును అపర విద్యలకు ఆది గురువైనట్టి భూసురోత్తమ లోక పూజ్యునకు జయమంగళం ॥ నేరేడు మారేడు నెలవంక మామిడి దూర్వార చెంగల్వ ఉత్తరేణు । వేరు వేరుగదెచ్చి వేడ్కతో పూజింతు పర్వమున దేవగణపతికి నిపుడు ॥జయ॥ సురుచిరముగ భాద్రపద శుద్ధ చవితియందు పొసగ సజ్జనులచే పూజగొల్తు ॥జయ॥ శశి చూడరాకున్న జేకొంటి నొక వ్రతము పర్వమున దేవగణపతికి నిపుడు ॥జయ॥ పానకము వడపప్పు పనస మామిడి పండ్లు దానిమ్మ ఖర్జూర, ద్రాక్షపండ్లు । తేనెతో మాగిన ,తియ్యమామిడి పండ్లు మాకు బుద్ధినిచ్చు గణపతికి నిపుడు ॥జయ॥ ఓ బొజ్జ గణపయ్య నీబంటు నేనయ్య ఉండ్రాళ్ళ మీదికి దండుపంపు । కమ్మని నెయ్యియు కడుముద్దపప్పుయు బొజ్జ విరుగగ దినుచు పొరలుకొనుచు ॥జయ॥ వెండి పళ్ళెరములో వేయివేల ముత్యాలు కొండలుగ నీలములు కలిపబోసి । మెండుగను హారములు మెడనిండ వేసికొని దండిగా నీకిత్తు ధవళహారతి ॥జయ॥ పువ్వులను నినుగొల్తు పుష్పాల నినుగొల్తు గంధాల నిన్నుగొల్తు కస్తూరిని । ఎప్పుడూ నినుగొల్తు ఏకచిత్తంబున పర్వమున దేవగణపతికి నిపుడు ॥జయ॥ ఏకదంతంబును ఎల్ల గజవదనంబు బాగయిన తొండంబు నలపుకడుపు । జోకయిన మూషికము సొరిది నెక్కాడుచును భవ్యుడగు దేవగణపతికి నిపుడు ॥జయ॥ మంగళము మంగళము మార్తాండ తేజునకు మంగళము దేవగణపతికి నిపుడు ॥జయ॥ బంగారు చెంబుతో గంగోదకము తెచ్చి సంగతిగ శివునకు జలకమార్చి ॥ మల్లెపువ్వులు దెచ్చి మురహరుని పూజింతు రంగైన నా ప్రాణలింగమునకు ॥జయ॥ పట్టుచీరలు మంచి పాడిపంటలు గల్గి గట్టిగా కనకములు కరులు హరులు ॥జయ॥ యిష్టసంపదలిచ్చి యేలిన స్వామికి పట్టభద్రుని దేవగణపతికి నిపుడు ॥జయ॥ ముక్కంటి తనయుడని ముదముతో వేమను చక్కనైన వస్తు సమితి గూర్చి ॥జయ॥ నిక్కముగ మనమును నీయందె నేనిల్పి ఎక్కుడగు పూజలాలింపజేతు ॥జయ॥ మల్లెలా మొల్లలా మంచి సంపెంగెలా చల్లనైన గంధ సారములను । ఉల్లమలరగ మంచి ఉత్తమపు పూజలు కొల్లలుగనేజేతు కోరి విఘ్నేశ ॥జయ॥ దేవాది దేవునకు దేవతాద్యునకు, దేవేంద్రవంద్యునకు దేవునకును ॥ దేవతలు మిముగొల్చి తెలిసి పూజింతురు భవ్యుడగు దేవగణపతికి నిపుడు ॥జయ॥ చెంగల్వ చేమంతి చెలరేగి గన్నేరు తామరలు తంగేడు తరచుగాను। పుష్పజాతులు తెచ్చి పూజింతు నేనెపుడు బహుబుద్ధి గణపతికి బాగుగాను ॥జయ॥ మారేడు మామిడి మాదీఫలంబులు ఖర్జూర పనసలును కదళికములు । నేరేడు నెలవంది టెంకాయ తేనెయు చాలగా నిచ్చెదరు చనువుతోను ॥జయ॥ ఓ బొజ్జగణపతి ఓర్పుతో రక్షించి కాచి మమ్మేలుమీ కరుణతోను । మాపాలగలవని మహిమీద నెల్లప్పుడు కొని యాడుచుందము కోర్కె లీడేర ॥జయ॥

# విఘ్నేశ్వరుని కథా ప్రారంభం

సూతమహాముని శౌనకాది మునులకు విఘ్నేశ్వరోత్పత్తియు, చంద్ర దర్శన దోషకారణంబును, తన్నివారణంబును చెప్పదొడంగెను.

పూర్వము గజరూపముగల రాక్షసేశ్వరుడు శివునిగూర్చి ఘోరతపంబొనర్చెను. అతని తపమునకు మెచ్చి పరమేశ్వరుడు ప్రత్యక్షమై వరంబు గోరుమనెను. అంత గజాసురుడు పరమేశ్వరుని స్తుతించి - స్వామీ ! నీవు ఎల్లప్పుడు నా యుదరమందే వసించియుండుమని కోరెను. భక్త సులభుడగు నా మహేశ్వరుండాతని కోర్కె దీర్చ గజాసురుని యుదరమందు ప్రవేశించి సుఖంబుండె.

కైలాసమున పార్వతీదేవి భర్తజాడ తెలియక పలుతెరంగుల నన్వేషించుచు కొంతకాలమునకు గజాసుర గర్భస్థుండగుట దెలిసి రప్పించుకొను మార్గంబుగానక పరితపించుచు విష్ణుమూర్తిని ప్రార్థించి తన వృత్తాంతం దెల్పె. ఓ మహానుభావా! పూర్వం బస్మాసురుని బారినుండి నా పతిని రక్షించి నా కొసగితివి. ఇప్పుడు గూడ నుపాయాంతరముచే రక్షింపుమని విలపింప. హరి యా పార్వతి నూరడించి పంపె. అంత నా హరి బ్రహ్మాది దేవతలను పిలిపించి, గజాసుర సంహారమునకు గంగిరెద్దుల మేళమే యుక్తమని నిశ్చయించి, నందిని గంగిరెద్దుగా నలంకరించి, బ్రహ్మాది దేవతలచే

తలకొక వాయిద్యమును ధరింపజేసి, తానునూ చిరుగంటలు, సన్నాయిని దాల్చి గజాసుర పురంబునుజొచ్చి, జగన్మోహనంబుగా నాడించుచుండ, గజాసురుడు విని వారల పిలిపించి తన భవనము యెదుట నాడించ నియమించెను. బ్రహ్మాది దేవతల వాద్యవిశేషంబులు జోరుగొల్ప జగన్నాటక సూత్రధారియగు నా హరి చిత్ర విచిత్రముగా గంగిరెద్దునాడించగా గజాసురుడు పరమానంద భరితుడై "మీకేమి కావలయునో కోరుడొసంగెద" నన. హరి సమీపించి "ఇది శివుని వాహనమగు నంది. శివుని కనుగొనుటకు వచ్చెగాన శివునొసంగు" మని పల్కె. ఆ మాటకు గజాసురుడు నివ్వెరపడి, అతనిని రాక్షసాంతకుడగు శ్రీహరిగా నెరంగి తనకు మరణమే నిశ్చయమనుకొనుచు తన గర్భస్థుండగు పరమేశ్వరుని" నా శిరస్సు త్రిలోక పూజ్యముగా చేసి, నా చర్మమును నీవు ధరింపవలె యని ప్రార్థించి, విష్ణుమూర్తికి అంగీకారము తెల్పె. హరి నందిని ప్రేరేపింప నందియు తన శృంగములచే గజాసురుని చీల్చి సంహరించె. అంత మహేశ్వరుడు గజాసుర గర్భమునుండి బహిర్గతుండై విష్ణుమూర్తిని స్తుతించె. అంత నాహరి" దుష్టాత్ముల కిట్టి వరంబులీయరాదు, యిచ్చినచో పామునకు పాలుపోసినట్లగునని, యుపదేశించి బ్రహ్మాది దేవతలకు వీడ్కొలిపి తానును వైకుంఠమున కెరిగె. శివుండు నందినెక్కి కైలాసంబున కతివేగమున జనియె.

## వినాయకోత్పత్తి

కైలాసంబున పార్వతి భర్తరాకను దేవతాదులవలన విని ముదమంది అభ్యంగ స్నానమాచరించి తన శరీరము నుండి వచ్చిన నలుగు పిండితో నొక బాలుని చేసి, ప్రాణంబొసంగి, వాకిలి ద్వారమున కాపుంచె. స్నానమానంతరము పార్వతి సర్వాభరణముల నలంకరించుకొని పతి ఆగమునమునకు నిరీక్షించుచుండెను. అంత పరమేశ్వరుడు నందినదిరోహించి వచ్చి, లోపలికి పోబోవ ద్వారమందున్న బాలకుడడ్డగింప కోపావేశుడై శివుడు త్రిశూలముచే నా బాలకుని కంఠంబు దురిమి లోనికేగె.



పార్వతీ దేవి భర్తను గాంచిదురేగి అర్ఘ్యపాద్యాదుల పూజించె, వారిరువురును ప్రియభాషణములు ముచ్చటించుచు ద్వారమందలి బాలుని ప్రసంగము వచ్చె. అంత

మహేశ్వరుడు తానొనరించిన పనికి చింతించి తాను తెచ్చిన గజాసుర శిరంబును నాబాలునికి కతికించి ప్రాణంబొసంగి గజాననుండని నామంబొసంగె. అతనిని పుత్ర ప్రేమంబున ఉమామహేశ్వరులు పెంచుకొనుచుండిరి. గజాననుడు తల్లితండ్రులను పరమ భక్తితో సేవించుచుండెను. ఇతడు సులభముగా ఎక్కి తిరుగుటకు అనింద్యుడను నొక ఎలుకను వాహనముగా చేసికొనెను. కొంతకాలమునకు పార్వతీ పరమేశ్వరులకు కుమారస్వామి జన్మించె. ఇతడు మహాబలశాలి ఇతని వాహనము నెమలి. ఇతడు దేవతల సేనా నాయకుడై ప్రఖ్యాతి గాంచియుండెను.

## విఘ్నేశాధిపత్యము

ఒకనాడు దేవతలు, మునులు పరమేశ్వరుని సేవించి విఘ్నముల కొక్కని అధిపతిగా తమ కొసంగమనిరి. గజాననుడు మరుగుజ్జువాడు, అసమర్థుడు గాన ఆయాధిపత్యము తన కొసంగుమని కుమారస్వామి తండ్రిని వేడుకొనెను. "మీలో నెవరు ముల్లోకములందలి పుణ్యనదులలో స్నానమాడి ముందుగా నాయొద్దకు వచ్చెదరో వారికా ధిపత్యము బొసంగెదనని మహేశ్వరుడు పలుక, సమ్మతించి కుమారస్వామి నెమలివాహనంబెక్కి వాయువేగంబున నేగె, గజాననుడు ఖిన్నుడై తండ్రిని సమీపించి ప్రణమిల్లి - అయ్యా! నా అసమర్థత తామెరింగియు నిట్లానతీయ తగునే! మీ పాదసేవకుండునగు నాయందు కటాక్షముంచి తగు నుపాయంబు దెల్పి రక్షింపవే. యని ప్రార్థింప, మహేశ్వరుండు దయాళుడై "సకృన్నారాయణేత్యుక్త్వాపుమాన్ కల్పశతత్రయం। గంగాది సర్వతీర్థేషు స్నాతోభవతి పుత్రక" కుమారా! ఒక్కసారి నారాయణ మంత్రము జపించిన మాత్రమున మూడు వందల కల్పములు పుణ్యనదులలో స్నానమొనర్చిన వాడగునని సక్రమంబుగ నారాయణ మంత్రము నుపదేశింప గజాననుడు అత్యంత భక్తితో నమ్మంత్రంబు జపించుచు కైలాసంబుననుండె.



అమ్మంత్ర ప్రభావంబున అంతకుపూర్వము గంగానదికి స్నానమాడ నేగిన కుమారస్వామికి గజాననుండా నదిలో స్నానమాడినటులనే చూచి ఆశ్చర్యపడుచు కైలాసమునకేగి తండ్రి సమీపమందున్న గజాసురునిగాంచి నమస్కరించి, తన బలమును నిందించుకొని, తండ్రీ! అన్నగారి మహిమ తెలియక నటులంటిని క్షమింపుము. ఈ

ఆధిపత్యంబు అన్నగారికే యొసంగు"డని ప్రార్థించె. అంత పరమేశ్వరునిచే భాద్రపద శుద్ధ చవితినాడు గజాననునికి ఆధిపత్యం బొసంగెను. ఆనాడు అందరూ విఘ్నేశ్వరునికి తమ విభవము కొలది కుడుములు, వడపప్పు మొదలగునవి సమర్పించి పూజింప విఘ్నేశ్వరుడు సంతుష్టుడై కుడుములు మున్నగున్నవి కొన్ని భక్షించియు, కొన్ని వాహనమునకొసంగియు, కొన్ని చేతధరించియు మందగమనంబున సూర్యాస్తమయ వేళకు కైలాసంబున కరిగి తల్లితండ్రులకు ప్రణామము సేయబోవ కడు శ్రమనొందుచుండ, శివుని శిరంబున వెలయు చంద్రుడు జూచి వికటంబుగా నవ్వె. అంత "రాజదృష్టి సోకిన రాలుగూడ నుగ్గగు" నను సామెత నిజమగునట్లు విఘ్నదేవుని గర్భంబు పగిలి అందున్న కుడుములు తత్ప్రదేశం బెల్లడల దొర్లెను. అతండును మృతుండయ్యెను. అంత పార్వతి శోకించుచు చంద్రుని చూచి, "పాపాత్ముడా! నీ దృష్టి తగిలి నా కుమారుడు మరణించెను గాన, నిన్ను జూచినవారు పాపాత్ములై నీలాపనిందలు పొందురుగాక !" యని శపించెను.

## ఋషిపత్నులకు నీలాపనింద కలుగుట

ఆ సమయమున సప్తమహర్షులు యజ్ఞంబు చేయుచు తమ భార్యలతో అగ్ని ప్రదక్షిణము చేయుచుండిరి. అగ్నిదేవుడు ఋషిపత్నులను మోహించి శాపబయంబున అశక్తుడై క్షీణించుచుండ, నయ్యది భార్యయగు స్వాహాదేవి గ్రహించి అరుంధతి రూపము దప్ప తక్కిన ఋషిపత్నుల రూపంబులతానే దాల్చి పతికి ప్రియంబు సేయ, ఋషులద్దానింగనుగొని అగ్నిదేవునితో నున్నవారు తమ భార్యలేనని శంకించి వారు తమ తమ భార్యలను విడనాడిరి. పార్వతి శాపానంతరము ఋషిపత్నులు చంద్రుని చూచుటచే వీరికిట్టి నీలాపనింద కలిగినది. దేవతలు, మునులు, ఋషిపత్నులు యాపద పరమేష్టికిందెల్ప నాతండు సర్వజ్ఞుడగుటచే అగ్ని హోత్రుని భార్యయే ఋషి పత్నుల రూపముదాల్చి వచ్చుటందెల్పి సప్తఋషులను సమాధానపరచి వారితో కూడ బ్రహ్మ కైలాసమున కేతెంచి ఉమామహేశ్వరుల సేవించి, మృతుండై పడియున్న విఘ్నేశ్వరుని బ్రతికించిరి. అంత దేవాదులు "పార్వతీదేవి! నీ వొసంగిన శాపంబు లోకంబులకు కీడు వాటిల్లెను గాన దాని నుపసంహరింపు" మని ప్రార్థింప, పార్వతి కుమారుని జేరదీసి ముద్దాడి "ఏదినంబున విఘ్నేశ్వరుని చూచి చంద్రుడు నవ్వెనో నా దినంబున చంద్రుని చూడరాదు" అని శాపవసానం బొసంగె. అంత బ్రహ్మాదులు సంతసించుచు తమ గృహములకేగి, భాద్రపద శుద్ధ చతుర్థియందు మాత్రమే చంద్రుని జూడక జాగరూకులై సుఖంబుగ నుండిరి ఇట్లు కొంతకాలము గడిచె.

## శమంతక మణ్యోపాఖ్యానము

ద్వాపరయుగమున ద్వారకావాసియగు శ్రీ కృష్ణుని నారదుండు దర్శించి ప్రియ సంభాషణలు జరుపుచు "స్వామీ! సాయం సమయంబయ్యె, ఈనాడు వినాయక



చతుర్థిగాన పార్వతి శాపంబుచె చంద్రుని జూడరాదు గాన నిజగృహంబున కేగెద సెలవిందు" అని బూర్వ వృత్తాంతం బంతయు శ్రీ కృష్ణునకు దెల్పి నారదుండు స్వర్గలోకమున కేగె.

అంత కృష్ణుడు ఆనాటి రాత్రి చంద్రుని నెవ్వరు చూడరాదని పట్టణంబున చాటింపించెను. శ్రీ కృష్ణుడు క్షీరప్రియుడగుటచే నాటి రాత్రి మింటివంక చేరకయే గోష్టమునకు బోయి పాలుపిదుకుచు పాలలో చంద్రుని ప్రతిబింబమును చూచి ఆహా! ఇక నాకెట్టి యపనింద రానున్నదో యని సంశయమున నుండెను. "కొన్నాళ్ళకు సాత్రాజిత్తు సూర్యవరముచే శమంతకమణిని సంపాదించి ద్వారకా పట్టణమునకు శ్రీ కృష్ణ దర్శనార్ధమై పోవ శ్రీ కృష్ణుడు మర్యాద చేసి ఆ మణిని మన రాజున కిమ్మని యడిగిన ఇది ఎనిమిది బారువల బంగారము దినంబున కొసంగు నిట్టి దీనిని నే యాప్తునికైనను ఏ మందమతియైన - నివ్వడ" నిన పొమ్మని యూరకుండెను. అంత నొకనాడు సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనుండా శమంతకమును కంఠమున ధరించి వేటాడ నడవికి బోవ నొక సింహమా శమంతకమణిని మాంసఖండమని భ్రమించి వానింజంపి యా మణింగొని పోవచుండ నొక భల్లూక మా సింహమును దునిమి యా మణింగొని తన కొండ బిలమున తొట్టెలో బవళించియున్న తన కుమార్తెయగు జాంబవతికి ఆట వస్తువుగ నొసంగెను. మరునాడు సత్రాజిత్తు, తమ్ముని మృతి విని శ్రీ కృష్ణుండు మణినియివ్వలేదని నా సోదరుని జంపి రత్న మపహరించెనని పట్టణమున జాటె. అది కృష్ణుండు విని నాడు క్షీరమున చంద్రబింబమున జూచిన దోష ఫలంబని యెంచి దానిం బాపుకొన బంధుసమేతుడై యరణ్యమునకు బోయి వెదకగా నొక్కచో ప్రసేన కళేబరంబును, సంగపు కాలిజాడలను, పిదప భల్లూక చరణ విన్యాసంబును గాన్పించెను. ఆ దారిని బట్టి పోవచుండ నొక పర్వత గుహ ద్వారంబుజూసి, పరివారము నచట విడిచి కృష్ణుడు గుహలోపలికేగి అచట బాలిక ఊయలపై కట్టబడియున్న మణింజూచి దానియెద్దకు పోయి ఆ మణిని చేత బుచ్చుకొని వచ్చుచున్నంత ఊయలలోని బాలిక ఏడ్వ దొడంగెను. వింతమానిసి వచ్చుననుచు కేకలు వేసెను. అంతట జాంబవంతుడు కోపావేశుండై శ్రీ కృష్ణుని పై బడి అరచుచు, నఖంబుల గ్రుచ్చుచు, కోరలం కొరుకుచు ఘోరముగ యుద్ధముచేయ కృష్ణుండును వానింబడద్రోసి వృక్షములచేతను రాళ్ళచేతను

తుదకు ముష్టిఘాతములచేతను రాత్రింబవళ్ళు యిరువది ఎనిమిది దినంబులు యుద్ధమొనర్ప జాంబవంతుడు క్షీణబలుడై, దేహంబెల్ల నొచ్చి భీతి చెందుచు తన బలంబు హరింప జేసిన పురుషుడు రావణ సంహారి యగు శ్రీరామచంద్రునిగా దలచి అంజలి ఘటించి, "దేవా! భక్తజన రక్షకా! నిన్ను త్రేతాయుగమున రావణాది దుష్ట రాక్షస సంహారణార్థమై అవతరించిన భక్తజనులను పాలించిన శ్రీరామచంద్రునిగా నెఱింగితి. ఆ కాలంబున నాయందలి వాత్సల్యముచే నన్ను వరంబు కోరుకొమ్మని ఆజ్ఞ యొసంగ నాబుద్ధి మాంద్యబున మీతో ద్వంద్వ యుద్ధము జేయవలెనని కోరుకొంటిని. కాలాంతరమున నది జరుగగలదని సెలవిచ్చితిరి. అది మొదలు మీ నామస్మరణ చేయుచు అనేక సంవత్సరములు గడుపుచు నిట నుండ నిపుడు తాము నా నివాసమునకు దయచేసి నా కోరిక నెరవేర్చితిరి. నా శరీరమంతయు శిథిలమయ్యె, ప్రాణములు కట్టబట్టె, జీవితేచ్ఛ నశించె, నన్ను క్షమించి కాపాడుము. నీ కన్న వేరు దిక్కులేరు అనుచు భీతిచే పరి పరి విధముల ప్రార్థింప శ్రీకృష్ణుడు దయాళుండై జాంబవంతుని శరీరమంతయు తన హస్తంబుచే నిమిరి, "భల్లూకేశ్వరా! శమంతకమణి నొసంగుము నేనేగెద అని దెల్ప నతడు శ్రీకృష్ణునికి మణి సహితముగా తన కుమార్తెయగు జాంబవతిని కానుకగా నొసంగె అంత తన ఆలస్యమునకు పరితపించుచున్న బంధుమిత్ర సైన్యముల కానందంబు కలిగించి కన్యారత్నముతోను మణితోను శ్రీ కృష్ణుడు పురంబుజేరి సత్రాజిత్తును రావించి పిన్న పెద్దలను జేర్చి యా వృత్తాంతమును జెప్పి శమంతకమణి యొసంగ నా సత్రాజిత్తు – "అయ్యో లేని పోని నిందమోపి దోషంబునకు బాల్పడితిని" నని విచారించి మణిసహితముగా తన కూతురగు సత్యభామను గైకొమ్మని, మణి వలదని మరల నొసంగెను. అంత కృష్ణుడు శుభముహూర్తమున జాంబవతీ, సత్యభామలను పరిణయంబాడ, నచ్చటికి వచ్చిన దేవాదులు మునుల స్తుతించి "మీరు సమర్థులు గనుక నీలాపనిందలు బాపుకొంటిరి, మాకేమి గతి, యని ప్రార్థింప శ్రీ కృష్ణుడు దయాళుడై భాద్రపద శుద్ధ చతుర్థినాడు గణపతిని యథావిధి పూజించి శమంతకమణి కథను విని, అక్షితలు శిరంబున దాల్చువారికి ఆనాడు ప్రమాదంబున చంద్రదర్శనమగుటచే వచ్చు నీలాపనిందలు పొందకుండుగాక! యని ఆనతీయ దేవాదులు సంతసించి తమ నివాసంబుల కరిగి ప్రతి సంవత్సరమును భాద్రపద శుద్ధ చతుర్థియందు దేవతలు, మహర్షులు, మానవులు తమతమ విభవము కొలది గణపతిని పూజించి అభీష్టసిద్ధిగాంచుచు సుఖంబుగా నుండిరని శౌనకాది మునులకు సూతుడు వినిపించి వారిని వీడ్కొని నిజాశ్రమంబున కరిగె.

వ్రత కథ సమాప్తము.

సర్వేజనా సుఖినోభవంతు.



తులసీ తోరం అద్భుతవరం చివరిపేజీలలో వివరం గలదు